తెలుగువారి ఆచారవ్యవహారాలు చిత్రించిన
తొలి తెలుగు నవల - ఆంధ్రేతర ప్రశస్తి
గడించుకొన్న ప్రథమ భారతీయ నవల

# రాజశేఖర చరిత్రము



## కందుకూరి వీరేశలింగము

RAJA SEKHARA CHARITRAMU

By

K. VEERESALINGAM PANTULU

Publishers :
M. Seshachalam & Co.,

THIRD EDITION:
AUG 1987

Printing :
M/s Jyothi Press, 1-4-1000, Golconda Cross
Musheerabad, Hyderabad – 500 380.

Distributors :

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS;
RASHTRAPATHI ROAD, SECUNDERABAD

RS.7.50/-

This Telugu novel

is

by permission

most respectfully dedicated

by the author

to

**Col Robert Mackenzie Macdonald,**

Director of Public Instruction,

Madras Presidency,

as a small token of esteem for the good

he has done to the Telugu Country.

# పీఠిక

## మొదటి కూర్పు

ఈవఱకు మనయాంధ్రభాషలో జనుల యాచారవ్యవహారములను దెలుఁపుచు నీతిబోధకములుగానుండు వచన ప్రబంధములేవియు లేకపోవుట యెల్లవారికిని విశద మయినదే యున్నదిగదా! అయినను దేశభాషలలోనెల్లను మధురమైనదని పేర్కొనఁబడిన మన తెనుఁగుభాష కటువంటి లోపమును తొలగింపవలయునని కొంతకాలము క్రిందట నే నీ గ్రంథమును వ్రాసి శ్రీవివేకవర్ధనీ పత్రికాముఖమునఁ బ్రకటించితిని. ఇట్టి గ్రంథములను వ్రాయుట కిదియే ప్రథమ ప్రయత్నమగుటచేత దీనియందుఁ బెక్కులోపములుండి యుండవచ్చును. అయినను దీనిం జదివినవా రందఱును నైకకంఠ్యముగా మంచియభిప్రాయమునే యిచ్చుచు వచ్చినందునను పలువురు పుస్తకముల నిమిత్తమయి వ్రాయుచు వచ్చుచున్నందునను నేను పడిన ప్రయాసము నిష్ఫలము కాలేదుగదాయని సంతోషించుచున్నాను.

*   *   *

ఈ గ్రంథముయొక్క కథను గల్పించుటలో గోల్డుస్మిత్తను నింగ్లీషు కవీశ్వరుని గ్రంథ సాహాయ్యమును గొంత బొందినను దానికిని దీనికిని విశేష సంబంధమేమియు నుండదనియు దీనియందు వ్రాయబడిన విషయములన్నియు నూతనములే యనియుఁ గూడ విన్నవించుచున్నాడను. గుణగ్రహణ పారీణులగు పెద్దలు దీనియందు దోషముల నుపేక్షచేసి గుణములనే గ్రహింతురనియు ఆంధ్రదేశీయులును విద్యాశాఖవారును దీని నాదరించి మఱియు నిట్టి గ్రంథములను చేయుటకయి నాకుఁ దగినంత ప్రోత్సాహమును గలిగింతురనియుఁ గోరుచున్నాఁడను.

రాజమహేంద్రవరము<br>
ది 20 వ జూలై 1880 సం॥రం } కందుకూరి వీరేశలింగము

## రెండవ కూర్పు

ఈ పుస్తక మింగ్లీషులోనికి భాషాంతరీకరింపఁబడి పుస్తక రూపముగాఁ బ్రకటింపఁబడియున్నందున, మార్పులను చేసినచో భాషాంతర గ్రంథముయొక్క సహాయ్యము చేత దీనిం జదివెడి యన్యదేశీయులకు కష్టముగా నుండునని యెంచి చేయఁదలచుకొన్న మార్పులను జేయక మొదటి కూర్పులో నున్నట్లే దీనిని మరల ముద్రింపించినాఁడను.

రాజమహేంద్రవరము
2 జనవరి, 1894 సంవత్సరం.
కందుకూరి వీరేశలింగము.

# నవలారచనకు శ్రీకారం:
# వచనరచనకు ఒజ్జబంతి

రాజశేఖర చరిత్ర మనే వివేక చంద్రిక తొలుదొలుత వివేకవర్ధని పత్రికలో 'సీరియల్'గా వెలువడింది. 1874 వ సంవత్సరంలో వీరేశలింగం పంతులుగారు వివేక వర్ధని అనే మాసపత్రికను స్థాపించి, దురాచార నిరసనకూ, సంఘ సంస్కారానికీ, దుర్మత భంజనానికీ పాటుపడ్డ విషయం లోక ప్రసిద్ధమే. ఆ పత్రికలో 1875 వ సంవత్సరంలో ఆరంభమై, సీరియల్ గా వెలువడి 1878 వ సంవత్సరంలో పుస్తక రూపాన్ని పొందింది. ఆ రోజుల్లోనూ, ఆటుపిమ్మట కూడా, విశేషమైన ఆదరాన్ని పొందింది. తొలి తెలుగు నవలగా కూడా పేరు ప్రఖ్యాతులను పొందింది. ఇప్పటికి తొమ్మిది ముద్రణలు పొందటం యీ రాజశేఖర చరిత్ర ప్రసిద్ధి కొక తార్కాణ కదా! ఇప్పుడీ పాకెట్ బుక్స్‌లో పదవసారి వెలవడుతున్న దన్నమాట. ఇంతే కాక వేర్వేరుగా ఇరువురు దీన్ని ఆంగ్లంలోకి అనువదించారు. ఒక అనువాదం మద్రాసు క్రిస్టియన్ కాలేజీ మ్యాగజైనులో కొంతభాగం వెలువడింది. వేరొక అనువాదం అదృష్ట చక్రం (Fortune's wheel) పేరుతో లండన్‌లో పుస్తక రూపాన అచ్చుకావటమే కాకుండా, 'లండన్ టైమ్స్' పత్రికయొక్క బహుళ ప్రశంసలను కూడా అందుకుంది. ఆనాటి 'లండన్ టైమ్స్' వీరేశలింగం పంతులుగారిని కూడా చాలా శ్లాఘించింది. ఇక దేశీయ భాషలపై రాజశేఖర చరిత్రం ప్రభావం గమనిస్తే, ఆ రోజుల్లోనే యీ నవల తమిళ, కన్నడ భాషల్లోకి అనువదింపబడటం, దీని గొప్పను నిరూపిస్తుంది. ఇది ఆలివర్. గోల్డ్‌స్మిత్

విరచిత 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' నవలకు స్వేచ్ఛానుసరణ మని పంతులుగారే చెప్పారు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారనేవారు వివేకచంద్రికా విమర్శన మన్న గ్రంథాన్ని పంతులు గారినీ, రాజశేఖర చరిత్రనూ విమర్శిస్తూ ప్రకటించారు. కాని యీ విమర్శ అంతా కూడా పంతులుగారిపై వారికి గల స్పర్థనే ప్రకటించింది కాని, ప్రతిభను చూపలేక పోయింది.

వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రం వెలువడక పూర్వమే నరహరి గోపాలకృష్ణమ్మశెట్టిగారు తమ 'హిందువుల యాచారములను తెలుపు నవీన ప్రబంధమైన' శ్రీ రంగరాజ చరిత్రను వెలువరచారు. ఇది 1872లో పుస్తక రూపాన వచ్చింది. ప్రచురణకు నోచుకోకపోయినా, గోపాలకృష్ణమ్మశెట్టిగారికన్నా కూడా పూర్వమే కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు 'మహాశ్వేత' అన్న వచన ప్రబంధాన్ని రచించి వున్నా రన్న వాదన కూడా వున్నది. ఈ రెండు విషయాలూ నిజమే అయినప్పటికీ కూడా, రాజశేఖర చరిత్రం యొక్క ప్రాముఖ్యానికీ, ప్రశస్తికీ, ప్రాథమ్యానికీ ఏమీ భంగంరాదు. ఎందువల్ల నంటే ఎవరు అర్వాచీనులకు ఆరాధ్యులు, అనుసరణీయులు, మార్గదర్శకులూ అవుతారో, వాళ్ళే ఆద్యులూ, ఉపదేష్టలూ అన్న కీర్తిని పొందుతారు. తరువాత వ్రాసిన నవల లన్నిటికీ, నవలా రచయిత లందరకూ చాలా కాలం వరకూ, రాజశేఖర చరిత్రమే మార్గదర్శకంగా వున్నది.

కనుకనే రాజశేఖర చరిత్రం తొలి తెలుగు నవల అయింది. వీరేశలింగం పంతులుగారు తెలుగు నవలకు శ్రీకారం చుట్టిన వారూ అయినారు.

సుప్రసిద్ధ నవలా రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు తమ స్వీయ చరిత్రలో తాము నవలలు వ్రాయటం రాజశేఖర చరిత్రం చదివి, గ్రహించి, నేర్చుకున్నామని వ్రాసుకున్నారు. చిలకమర్తి ఆ రోజుల్లో బహుళ ప్రచారం పొందిన నవలల నెన్నో వ్రాశారు. ఆ రోజుల్లో చింతామణి అన్న సాహిత్య మాసపత్రిక నవలల పోటీలను నిర్వహిస్తుం

జేది. ఆ పోటీల్లో ఎన్నోమార్లు లక్ష్మీనరసింహంగారు బహుమతి పొందారు. లక్ష్మీనరసింహంగారు నవలల పోటీలో పాల్గొంటే మరొకరికి బహుమతి రాదన్న ప్రసిద్ధి కూడా ఆ రోజుల్లో వుండేదని, తామే స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. అటువంటి చిలకమర్తి తాము నవలలు వ్రాయటం రాజశేఖర చరిత్రాన్ని చూసే గ్రహించామని చెప్పుకున్నారు. బాగా పరిశీలించి చూస్తే చిలకమర్తి తొలి నవల రామచంద్రవిజయానికీ, తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్రానికీ చాలా పోలికలు కన్పిస్తాయి. వర్ణనలూ, సంఘ సంస్కార విషయాలూ, పాత్ర చిత్రణం, ఇంకా అనేక సందర్భాలలో యీ రెండు నవలలకూ దగ్గరి పోలిక లున్నాయి.

దీనినిబట్టి మనం గ్రహించవలసిన విషయం ఏమిటంటే వీరేశలింగం పంతులుగారికి తరువాత నవలలు వ్రాసిన వాళ్ళందరూ ఆయనను అనుసరించారు—అని. అందువలన వీరేశలింగం పంతులుకి పూర్వమే నవలు వ్రాయటానికి గారికి కొందరు ప్రయత్నించినా, కొంత కృషి జరిగినా, వీరికి తరువాత వ్రాసినవాళ్ళందరూ వీరినే ఆదర్శంగా పెట్టుకున్నారు. కాబట్టి, తెలుగులో యీ ప్రక్రియకు ఆయనే ఆద్యుడైనాడు. నవల అనబడే ప్రక్రియ కొక స్థితినీ, ప్రాచుర్యాన్నీ కలిగించినవాడూ అయినాడు. నన్నయ్యగారికి ముందే తెలుగు భాషా, అందునా పద్యరచనావున్నా, నన్నయ్యే ఆదికవీ, వాగనుశాసనుడూ అయినట్లు వీరేశలింగమే నవలా రచనకు ఆద్యుడూ, ఆదర్శమూ అయినాడు. ఇంగ్లీషు భాషా ప్రభావంవల్ల, తెలుగులో కొత్త ప్రక్రియగా నవల రూంపొందింది అనుకుంటే రాజశేఖర చరిత్రమే తొలి తెనుగు నవల అవుతుంది. రాజశేఖర చరిత్రం పూర్వం నవలలుగా వ్రాయబడిన వని చెప్పబడుతున్న వానిపై ఇంగ్లీషు ప్రభావం స్పష్టంగా లేదు. ముందుముందు ఇప్పుడు మనం నవల అంటున్న ప్రక్రియను. వచన ప్రబంధమనీ, ఆఖ్యానమనీ అనేవారు. తరవాత 'నవల' అన్నారు. నవల అనటంలో ఇంగ్లీషు

ప్రభావం వుంది. ఆ ప్రభావం రాజశేఖర చరిత్రంపైన వున్నది. అందువలన ఇదే తొలి తెలుగు నవల అవుతున్నది.

రాజశేఖర చరిత్రం ఆంగ్లమూలానికి యథేచ్ఛానువాదం అయినా, స్వకపోల కల్పితంగా రచింపబడ్డదా అన్నంత ప్రతిభా సమున్మిషితంగా వున్నది. సాంఘిక దురాచారాలను రూపుమాపటమే ప్రధాన లక్ష్యంగా రచింపబడినా, కావ్య సౌందర్యం ఇందులో గౌణంకాదు. ఆ రోజుల్లో వచనరచనకు వొజ్జబంతిలాగా సరళ సుందరమైన శైలీవిన్యాసంతో పంతులుగారీ నవలను రచించారు.

సమకాలీన సారస్వతేయులలో, పాఠకులలో గొప్ప ఆదరాభిమానాలను పొందింది యీ నవల. ఎన్నోమార్లు యూనివర్శిటీ పాఠ్యపుస్తకంగా కూడా ఎన్నిక చేయబడ్డది. సాంఘిక రంగంలోనూ, సారస్వత విషయంగానూ వీరేశలింగం పంతులు గారితో ప్రబలమైన స్పర్థ వహించివున్న కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, తమ 'బిల్వేశ్వరీయ' మన్న మహాగ్రంథాన్ని పంతులుగారికి పంపుతూ, తమ సుహృద్భావాన్ని యీ విధంగా వెల్లడి చేశారు.

ఆ రోజుల్లో గొప్పగొప్ప పండితులూ, కవులూ, తమ గ్రంథాలను పంతులుగారి అభిప్రాయం కోరుతూనూ, అభివందనలతోనూ పంపుతూ వుండేవారు. 'బిల్వేశ్వరీయం' పంపుతూ- కొక్కొండ యీ విధంగా లోపలి మొదటిపేజీపై వ్రాశారు:

'ముందుగ దెనుగున బలు గబ్బంబుల
ముద మందం జేయుట చేతన్
సుందరముగ రాజశేఖర చరిత
జొప్పడగం జెప్పుట చేతన్
కందుకూరి వీరేశలింగ మను కవి కిది
కవిమణి నామకృతిన్
పొందుగ బిల్వేశ్వరీయము స్నే
ల్పొందగ వేంకటరత్న మిడెన్

చెన్నపురి, తిరువట్టేశ్వరుని పేట
౧౮౯3 సం॥ ఆగస్టు 30 తేది.

ప్రత్యేకించి కొక్కొండ రాజశేఖర చరిత్రాన్ని పేర్కొన్నా రంటే, దాని ప్రశస్తి ఆనాటికే ఎంత వ్యాపించిందో తెలుస్తున్నది.

గురజాడ అప్పారావుగారు తమ డైరీలో వొకచోట, రాజశేఖర చరిత్రను గూర్చి ప్రస్తావిస్తూ, గోల్డ్‌స్మిత్ రచన కనుసరణ మనీ, ఇది బహుళ ప్రచారం పొందిన గ్రంథమనీ వ్రాసుకున్నారు.

పంతులుగారు వ్రాసిన నవలలలోనే కాక, వారి సర్వ సాహిత్య సృష్టిలోనూ, ఆధునికాంధ్ర వాఙ్మయంలోనూ, రాజశేఖర చరిత్రానికి విశిష్టమైన స్థానమున్నది. రాజశేఖర చరిత్రం వెలువడటంతో, ఆంధ్ర వాఙ్మయంలోనే వొక ఉజ్జ్వలాధ్యాయం ప్రారంభమైనదని చెప్పాలి. ఈ నవల రచించే కాలానికి పంతులుగారి వయస్సు ఇరవై ఏడు ఏండ్లు. పుస్తకంగా వచ్చేటప్పటికి ముప్పై ఏళ్ళు. పంతులుగారి జీవితంలో రాజశేఖర చరిత్ర రచనం గొప్ప మలుపు. వారి మహాత్వాని కంతకూ శ్రీకారం అక్కడే ప్రారంభం. పంతులుగారి విశ్వాసాలలో, అభిరుచుల్లో, ఆదర్శాలలో రాజశేఖర చరిత్రం వొక గొప్ప పరిణామాన్ని నిరూపిస్తున్నది. సాహిత్యమంటే ఎట్లా ఉండాలి, ఏ ప్రయోజనాలను సాధించాలి అన్న పంతులుగారి జిజ్ఞాసకు, రాజశేఖర చరిత్రం సరైన పరిష్కారాన్ని చూపటమే కాక, వారు సాధించిన పరమ ప్రయోజనానికి లక్ష్యప్రాయంగా కూడా వెలసింది. రాజశేఖర చరిత్రం రచించటానికి పూర్వం, వీరేశలింగంగారు శృంగార నిరోష్ఠ్యనిర్వచన నైషధం, రసిక జనరంజనం, శుద్ధాంధ్రోత్తర రామాయణము, శుద్ధాంధ్ర భారత సంగ్రహము మొదలైన పద్యకావ్యాలూ, విగ్రహం మొదలైన వచన కావ్యాలు వ్రాశారు. ఈ నవల వ్రాసిన తరువాత మళ్లా వెనుకటి గ్రంథాల వంటివి ఎప్పుడూ వ్రాయలేదు.

రాజశేఖర చరిత్రకు మూలం అని చెప్పవలసిన 'ది వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' ప్రపంచంలోని నాగరిక భాషల్లోకి అన్నింటి లోకీ అనువదింపబడింది. అయితే తెలుగులోకి అనువాదం కాక, అనుసరణగా వచ్చింది. తెలుగు నవలలో సాంఘిక విమర్శ ప్రధానస్థానం ఆక్రమించింది.

రాజశేఖర చరిత్రంలో రాజశేఖరుడుగారి అమాయ కత్వము, అవివేకము ఆ కుటుంబం పడిన అష్టకష్టాలన్నింటికీ మూలం. సంఘంలోని కపటులు, కల్లరులు, కుక్షింబరులు, స్తుతి పాఠకులు, దాంభికులు ఏ విధంగా అమాయకులను బాధించి, తాము బాగుపడుతున్నారో, అంధ విశ్వాసాలవల్ల, అవివేకపు టాచారాలవల్ల కొన్ని కుటుంబా లెట్లా నాశనమై పోతున్నాయో రాజశేఖర చరిత్రంలోని సంఘటనల వలన తెలుసుకోవచ్చును. ప్రతి సంఘటనా - వొక సాంఘిక దురా చారాన్ని, వొక మూఢ విశ్వాసాన్ని హేళనచేసి, వికృత పరచి, విమర్శించే ఉద్దేశంతో పంతులుగారు యీ నవలలో కల్పించారు. రుక్మిణి కాసులపేరు రథోత్సవంలో దొంగిలించ బడటం- ప్రశ్న చెప్పేవారి దాంభిక వర్తనను బట్టబయలు చేయటానికీ, నృసింహస్వామి మరణవార్త- ఎఱుక చెప్పువాళ్ళ కాపట్యాన్ని, ఎరుక నమ్మేవాళ్ళ మూర్ఖత్వాన్నీ హేళన చేయటానికీ, నృసింహస్వామి రుక్మిణి కలలో కల్పించటం- భూత, ప్రేత, పిశాచాదులను వేళాకోళం చేయటానికీ పంతులుగారు కల్పించారు. హరిశాస్త్రిల భూతవైద్యం, పిఠా పురంలో అంజనంవేసి దొంగను పట్టటం, స్వర్ణయోగం తెలుసు నన్న బైరాగి- ఇచ్చిన స్వర్ణాన్ని దొంగిలించి పలాయనం చిత్త గించటం, సిద్ధాంతి కూతురు గ్రహబాధ, బొమ్మకంటి సుబ్బా రాయుడి ఆతుర సన్యాసం, హరి పాపయ్య శాస్త్రిలవారి భోజన పాండిత్యం, పీఠాధిపతుల ఆర్భాటాలూ, మఠాధిపతుల కుక్షింభరత్వం, ఇళ్ళు కాలిపోతే గ్రామదేవతకు శాంతి చేయటం - ఇంకా వీధి బడుల్లోని అక్రమాలూ, వంట

బ్రాహ్మలూ- శవవాహకుల మూర్ఖవర్తనలు పంతులుగారు యీ నవలలో విమర్శించారు.

ఆనాడు సంఘంలో ప్రచురంగా కొనసాగుతున్న సర్వ దురాచారాలనూ, పంతులుగారు యీ నవలలో వజ్రాభమైన తమ నిశిత బుద్ధిని చూపి, ఆవేశంతో చెండాడారు. జోస్యుల కామావధాని, ముష్టి సర్వశాస్త్రి, నంబి రాఘవాచార్యుడు, వామరాజు భైరవమూర్తి, బులుసు పేరయ్య సోమయాజి, మంచిరాజు పాపయ్య, నీళ్ళకావిడి వెంకయ్య - వీళ్ళంతా నాటి సంఘానికి ప్రతీకలే.

పంతులుగారి మహా యశస్సుకు శరత్కాముది రాజశేఖర చరిత్రము.*

జనవరి 10, 1969<br>హైదరాబాదు.

డా॥ అక్కిరాజు రమాపతిరావు<br>(మంజుశ్రీ).

*రాజశేఖర చరిత్రము గూర్చి ఇంకా వివరాలు తెలుసుకో దలిస్తే శ్రీ తిరకాకారుని పరిశోధన గ్రంథం "వీరేశలింగం పంతులు-ఒక సవిమర్శ పరిశీలనము" చూడవచ్చును.

# వివేకచంద్రిక

అను

# రాజశేఖర చరిత్రము

## మొదటి ప్రకరణము

ధవళగిరి—దేవాలయవర్ణనము—గోదావరి యొడ్డుననున్న ధర్మశాల మీఁద ప్రాతఃకాలమున రాజశేఖరుఁడుగారు వచ్చి కూర్చుండుట—అప్పుడచ్చటికి వచ్చిన సిద్ధాంతి మొదలగువారి స్తుతి వచనములు—అందఱును గలిసి రామపాదములయొద్దకు బైరాగిని చూడఁబోవుట.

శ్రీనాసికాత్ర్యంబకముకడ కడుదూరమున నెక్కడనో పశ్చిమమున నొక్కయున్నత గోత్రమున జననమొంది ఊర్మికా కంకణాదుల మెఱుంగులు తుఱంగలింపఁ దనజననమునకు స్థానమైన భూభృద్వర పురోభాగముననే పల్లములం బడి జాఱుచు లేచుచుఁ గొంతకాలముండి యక్కడనుండి మెల్ల మెల్లఁగా ముందుముందుకు ప్రాఁకనేర్చి యెల్లవారల చూడ్కులకు వేడ్కలు నింపుచు, పిదప నవ్యక్తమధుర స్వరంబులతో ముద్దులు గులుకు శరవేగమునఁ బరుగిడుచు, ఆ పిమ్మట ఘనతరుల చెంతఁజేరి తల్లి వేళ్ళను విడిచి తక్కినవేళ్ళనంటుచుంబాఱి జమ్ములో నడఁగి దాఁగుడుమూఁత లాడుచు, వెలువడి విదర్భాదిదేశములగుండఁ బ్రయాణములుచేసి త్రోవపొడుగునను వచ్చిపుచ్చుకొనని వారిదే లోపముగా స్నానపానంబులకు వలయునంత నిర్మల జలం బొసఁగి యాబాలవృద్ధ మందఱి నానంద మొందించుచు తానడుగిడిన చోటులనెల్ల సస్యములకును ఫలవృక్షములకును జీవనములిచ్చి వానివి

ఫలప్రదములఁ గావించుచు తన చల్లదనము వ్యాపించినంతవఱకు నిరుపార్శ్వములందును భూమినంతను బచ్చని లేఁబచ్చికతో నలంకరించి పశుగణంబుల కాహారంబు కల్పించుచు, తనరాక విని దూరమునుండి బయలుదేఱి యడవిపండ్లును వెమలికన్నులను వహించి పొంగి నానాముఖములఁ దన్నుఁ గానవచ్చు వరద, మంజీర, పిన్నగంగ మొదలగువారి నాదరించి లోఁగొనుచు, అంతకంతకుఁ దన గంభీరత గానుపింప నాథుని వెదకి కొనుచు వచ్చివచ్చి, యేగిరిని దూరమునుండి విలోకించి గోదావరి రసోత్తరంగముగా ఘోషించుచు పాదమునంబడి శిఖరంబున నధివసించు జనార్దనస్వామి దర్శనము చేసికొని తోడనే యచ్చటనుండి తనశాఖారూపము లయిన రెండు చేతులనుజాచి సరసతమీఱ నాథునిం గలియు భాగ్యము గాంచెనో యా ధవళగిరి, యాంధ్రదేశమున కలంకారభూతమయి రాజమహేంద్రవరపుర సమీపమున మిక్కిలి వన్నెకెక్కి యుండెను.

ఆ పర్వత మంతయున్నతమయినది కాకపోయినను, తెల్లని పిండిరాళ్ళతో నిండి యుండుటచేఁ జూచుట కెంతయు వింతగా మాత్ర ముండును; ఆ రాళ్ళనుబట్టియే దానికి ధవళగిరి యను నామము కలిగి యుండును. దక్షిణపువైపునఁ గ్రిందినుండి పర్వతాగ్రమువఱకును నల్లరాళ్ళతోఁ జక్కనిసోపానములు కట్టబడియున్నవి. ఆ సోపానముల కిరుప్రక్కలను కొండపొడుగున నర్చకులయుఁ దదితరులగు వైష్ణవస్వాములయు గృహములు చాలుగానుండి కన్నులపండువు చేయు చుండును. ఆ సోపానముల వెంబడిని బైకిఁ జనినచో గొండమీఁద నల్లరాళ్ళతోఁ గట్టఁబడిన సుందరమైన చిన్నదేవాలయ మొక్కటి కానఁబడును. దాని చుట్టును నించుమించుగా నిలువెడెత్తు ప్రాకారము మూఁడు ప్రక్కలను బలిసియుండును. ఉత్తరపు వైపునమాత్రము గోడకు బదులుగా పర్వతశృంగమే పైకి వ్యాపించి, గోడలు తన పాదము నాశ్రయింప వానిని మించి యాలయశిఖరమును నిక్కి చూచుచుండును. ప్రాకారములోపలనె యుత్తరమున నొక చిన్న గుహ కలదు. అందులోఁగూర్చుండి పాండవులు పూర్వమరణ్యావాసము చేయునప్పుడు తపస్సు చేసిరని పెద్దలు చెప్పుదురు. అందులో

నప్పుడు చిన్న రాతివిగ్రహ మొక్కటియుండెను. సంవత్సరము పొడుగునను పూజాపురస్కారములు లేక బూజుపట్టియున్నయాదేవర నుత్సవదినములలో నర్చకుండొకఁడు పైకిఁ దీసి పులికాపుచేసి, ఆస్వామి సన్నిధానమున దీపము నొకదానిని వెలిగించి గుహాముఖం బునఁ దాను నిలుచుండి పల్లెలనుండి యాత్రార్థమువచ్చిన మూకల వలనం దలకొకడబ్బువంతునఁ బుచ్చుకొని లోనికిం గొనిపోయి దేవతాదర్శనము చేయించి వారిపెద్దలు ధన్యులయిరని జెప్పి పంపు చుండును. జనార్దనస్వామి కళ్యాణదినములు నాలుగును వెళ్ళినతోడనే యెప్పటియట్ల స్వామిరథముయొక్క పగ్గముల నందుంచి వాని కా చిన్న దేవరను-గావలియుంచి జీతబత్తెములు లేకపోయినను రాత్రిం దివములు కాలుగదలపక స్థిరవృత్తితోఁ గాచుచుండు నాపిన్న దేవర యెడం గల విశ్వాసముచేత పూజారులు మఱుచటి సంవత్సర మా త్రాళ్ళపని మఱల వచ్చువఱకును ఆ గుహత్రొక్క చూడనక్కర లేక నిర్విచారముగా నుందురు. ఈప్రకారముగ మనుష్యులు భక్తి హీనులయి దేవతా సందర్శనము చేసికోకపోయినను పర్వతమును కనిపెట్టుకొనియున్న చిన్న చతుష్పాద జంతువులు మాత్రము మిక్కిలి భక్తికలవై నిత్యము నాస్వామిని సందర్శించుకొనుచు ఉత్సవ దినము లలో మనుష్యులు వచ్చి తమ్ముఁ దఱిమి వేయునంతటి పాపముం గట్టుకొన్నదాఁక రాత్రులు దేవతాసన్నిధానమున గుహలో వట్టి భూతలముననే శయనించుచుండును. తూర్పు వయిపునఁ బ్రాకారము లోనే జనార్దనస్వామి కెదురుగా గొప్ప ధ్వజస్తంభ మొకటి యున్నది, దాని శిఖరమున నున్న చిఱు గంటలు గాలికిఁ గదలుచు సదా శ్రావ్య మయిన నాదముతోఁ జెవులను దనుపుచుండును. ఆ స్తంభమునకు మొదట నాంజనేయ విగ్రహ మొకటి చేతులు జోడించుకొని స్వామి కభిముఖమయి నిలిచి యుండును. ఈ శిలా విగ్రహమునకును ధ్వజ స్తంభమునకును ఉత్తరముగాఁ గళ్యాణ మంటప మొకటి యుండెను. స్వామి కళ్యాణ దినములలో నుత్సవ విగ్రహములనందు వేంచేయింపఁ జేసి యథావిధిగా వివాహ తంత్రము నంతయు మహావైభవముతో నడిపింతురు.

ప్రతి మాసమును రెండు పక్షముల యందును ముఖ మంట
పము మీఁద ఏకాదశినాఁడు రాత్రి హరి భజనము జరుగుచుండును. హరి భక్తులు తులసి పూసల తావళములను ధరించుకొని ద్వాదశోర్ధ్వ పుండ్రములను స్ఫుటముగాఁ బెట్టుకొని, కరతాళములును మృదంగ ములను మ్రోగుచుండఁగా దంబురలు మీటుచు, బిగ్గఱగాఁ దమ యావచ్ఛక్తిని "నవనీతచోరా" "గోపికాజారా" "రాధికాలోలా" "గోపాలబాలా" మొదలగు నామములచే నిష్టదేవతలను సంబోధిం చుచుమధ్యమధ్య గొంతుకలు బొంగురుపోయినప్పుడు మిరియములను బెల్లపు ముక్కలను నమలుచు కృష్ణలీలలను పాడుచుందురు. తలలు త్రిప్పుచు భక్తులు తమ సత్తువంతయుఁ జూపి చేతికొలఁదిని వాయిం చుటచే నొకానొకప్పుడు మద్దెలలును తాళములును పగిలి పోవుటయు సంభవించుచుండును. దేవతావేశముచేత తఱుచుగా భక్తులలో నొక రిద్దఱు దేహములు పరవశమయి రెండు మూడు నిముషములవఱకు వెనుకకు స్తంభము మీఁది కొఱగు చుండుటయుఁ గలదు. ఇట్టి భక్తి మార్గమును బొత్తిగా గుర్తెఱుఁగని యన్యదేశీయులకు మాత్రము వారి యప్పటి చేష్టలు పిచ్చి చేష్టలవలెఁ గనఁబడునుగాని, వేడుక చూడవచ్చిన జనులు వారెంత వికృతముగా కేకలు వేయుచు భజన చేయుదురో యంత పరమ భాగవతోత్తములని తలఁతురు.

కొంచెము శ్రమపడి యెవ్వరైన మధ్యాహ్నవేళ నొక్కసారి కొండమీఁదికెక్కి నలుఁగడలఁ జూడ్కి నిగిడించినచో, వన్నెవన్నెల పిల్లలు చెంగుచెంగునఁ దమముందఱ దుముకులాడుచుండఁ గొండ బొడుగునను ముంగాళ్లు మీఁదికెత్తి పొదలపయి యాకులను మేయు మేఁకలును, పూర్వదక్షిణములఁ గుప్పవోసినట్లున్న తాటాకుల యిండ్ల నడుమ వానిని వెక్కిరించున ట్లక్కడక్కడ నెత్తుగా నొక్కొక్క పెంకుటిల్లును ఉత్తరమున మంచెలపై నుండి పొలము కాపులు కో యని కూఁత లిడుచు నొడిసెలలు ద్రిప్పుచు బెదిరింపఁ జేరువ తోపులలోనుండి వెలువడి మధుర రుతములు చేయుచు ఆకాశ మున కెగయుచు సందయినప్పుడు కంకులను విఱుచుకొని పఱచి పలు విధములయిన పక్షులు చెట్ల కొమ్మలమీఁదఁ బెట్టుకొని తినుచుండ

ముచ్చటగా నుండు పలువిధముల పచ్చని పయిరులును. ఆ పయిని వృక్షములమీఁదను గూర్చుండి కర్ణ రసాయనముగాఁ బిల్లన గ్రోవిని మోవినిబూని పాడెడి గోపబాలకుల గానములకు హృదయములు కరఁగి మేపులు చాలించి క్రేపుల తోడఁగూడఁ జెవులు నిక్కించి యఱ్ఱులు చాచి యాలింపుచు నడుమ నడుమ గడ్డిపఱకలు కొఱుకుచు బయిళ్ళయందు నిలుచున్న పశుగణములును. పడమటను నీలముల వలెనున్న తేఁట నీటిపై సూర్యకిరణములు పడి యెల్లెడలను వజ్రపు తళుకులను బుట్టింపఁ బలుతెఱంగుల జలవిహంగంబులు పుట్టచెండ్ల వలె మీలఁ బట్టుకొనుటకయి నీటం బడుచు లేచుచుఁ బ్రవాహంబు తోడం బఱచుచుండ నఖండ గౌతమియు నేత్రోత్సవము చేయుచుండును.

ఆ పర్వతపాదమునకు సమీపమున గోదావరి యొడ్డున నల్లరాతి బండమీఁదఁ జక్కఁగా మలఁచిన రామ పాదములు వెలసియున్నవి. శ్రీరాములవారు పూర్వకాలమున సీతా లక్ష్మణులతోడఁ గూడఁ బర్ణశాలకుఁ బోవుచు త్రోవలో ఈ పర్వత సమీపమున నడచిన నాటి పాదముల చిహ్నములే యవి యని యెల్లవారును నమ్ముదురు. కాఁబట్టి యా రామ పాదములను సందర్శింపవలెనను నభిలాషతో దూరదేశముల నుండి సహితము యాత్రాపరులు వచ్చి రామపాద క్షేత్రమున నఖండ గౌతమీస్నానము చేసికొని. కొండ మీఁది కెక్కి శ్రీ జనార్దనస్వామివారి దర్శనము చేసికొని. స్వశక్త్యనుసారముగా దక్షిణతోడి ఫలములను సమర్పించి కలిగినవారైన స్వామికి భోగము సహితము చేయించి మఱి పోవుచుందురు. అది దివ్యక్షేత్ర మగుటం జేసి జాతిమతభేదములేక యెల్లవారును పులియోగిరము దధ్యోదనము మొదలుగాఁ గల స్వామి ప్రసాదమును స్వీకరించి కన్నుల కద్దుకొని యచ్చటనే యారగించి చేతుల నంటుకొన్నదానిని కడుగుకొన్న నపచార మగును గనుక గరతలములు పయికెత్తి చేతుల కందినంత వఱకు దేవాలయ స్తంభములకును గోడలకును వర్ణము వేయుటయే కాక తచ్ఛేషముతోఁ దమమీఁజేతులకును బట్టలకును మెఱుఁగు పెట్టుకొనుచుందురు.

ఈ కొండకు దక్షిణమునకు తూర్పునను కొంత దూరము వఱకు గ్రామము వ్యాపించి యున్నది. పర్వతము పేరే పూర్వము గ్రామమునకుంగూడఁ గలిగియుండెను. కాని యిప్పుడిప్పుడు గ్రామమును ధవళేశ్వర మని వ్యవహరించుచున్నారు. కొండమీఁది నుండి సోపానములు దిగి వచ్చినతోడనే రాజవీధియొక్క యావలి ప్రక్కను శ్రీ అగస్త్యేశ్వరస్వామివారి యాలయ మొక్కటి లోచన గోచరం బగును. తొల్లి వింధ్యపర్వతము యొక్క గర్వము నణఁచి దక్షిణాభిముఖుఁడయి చనుచు అగస్త్యుఁడాస్వామిని అచట ప్రతిష్ఠచేసెనని స్థలపురాణము చెప్పుచున్నది. ఈ దేవాలయమునకును పర్వతమునకును మధ్యను తూర్పుననుండి పడమటకు గోదావరి వఱకును విశాలమయిన రాజవీధి యొకటి గలదు. ఆ వీధి చివరను నల్లరాళ్ళతో నీటి వఱకును సోపానములు కట్టఁబడియున్నవి. సోపానములకు సమీపమున వీధికిఁ దూర్పు ప్రక్కను "ధర్మచావడి" అని యొకటి యుండెను. అది పరదేశబ్రాహ్మణులును మార్గస్థులును రాత్రులు పరుండుటకై మొట్టమొదట కట్టఁబడినది కాని, ఆ కాలమం దది యుబుసు పోవుటకై గ్రామములోని పెద్ద మనుష్యులు ప్రతిదినమును ఉదయాస్తమయ సమయములయందు ప్రోగై యిష్టకథా గోష్ఠిం గొంత ప్రొద్దుపుచ్చి పోవుచుండుటకు మాత్రము వినియోగపడుచుండెను.

ఒకానొక దినమున సూర్యుఁ డుదయించి ప్రాచీముఖంబునఁ గుంకుమబొట్టుచందంబు వహించి వృక్షాగ్రములను బంగారు నీరు పూసినట్టు ప్రకాశింపఁజేయుచుండెను; చెట్ల మీఁది గూళ్ళనుండి కల కల ధ్వనులతో వెలువడి పక్షులు నానాముఖముల ఎర కయి వెడలుచుండెను: పసులకాపరి బాలురు చలిదులు మూటగట్టుకొని పశువుల మందలను దోలుకొని పచ్చికపట్ల కరుగుచుండ, వెనుక 'వెల్లావు కడి నాది' 'దోరగేదె కడి నాది'యని గంపలు చేతఁబట్టుకొని, పడుచులొండొరుల మీఱి పరుగులిడుచుండిరి. కాపులు ములుకోలలు భుజముల మీఁదఁ బెట్టుకొని, కోడెలను దోలుకొని తమతమ పొలము

లకుం బోవుచుండిరి; అప్పుడు కాయ శరీరముగల యొక పెద్ద మనుష్యు(డు జంధెము పేరుగా వేసికొని యెడమచేతిలో నిత్తడి చెంబు నొకదానిం బట్టుకొని, గోదావరిలో( గాళ్ళను చేతులును గడుగుకొని, ఒడ్డునకు వచ్చి పుక్కిలించివైచి యజ్ఞోపవీతమును సవ్యముగా వేసికొనివచ్చి, ధర్మశాల మీ(ద నొడ్డున గూర్చుండి, వచ్చునప్పుడు చెంబులో వేసి తెచ్చుకొన్న తుమ్మ పుడకతో దంత ధావనము చేసికొనుచుండెను. ఆయనకు వయస్సు నలువది సంవత్సరము లుండును; మొగము మీ(ద స్ఫోటకపుమచ్చలే లేకపోయెనేని, మొగము సుందరమయిన దనుటకు సందేహింప నక్కఱ యుండదు; అట్లని, యాముఖ మాయనను నిత్యమును దర్శింపవచ్చు ప్రవక్తల స్తోత్రములకు మాత్రమెప్పుడును బాత్రము కాకపోలేదు; శరీరచ్ఛాయ యెఱ్ఱనిది; విగ్రహము కొంచెము స్థూలముగాను పొట్టిగాను ఉండును; నుదురు విశాలమయి చూచువారి కతడు పండితు(డని తోప(జేయుచున్నది; అప్పుడు కట్టుకొన్నది గోరంచు నీరు కావి దోవతి; సరిగంచుల చలువ వస్త్రమొకటి శిరస్సునకు వదులుగా చుట్ట(బడి కొంగు కొంత వ్రేలాడ వేయ(బడి యున్నది; చెవుల నున్న రవలయంటుజోడును, కర్మిష్ఠు( డనుటకు సాక్ష్యమిచ్చుచున్న కుడిచేతి యనామిక యందలి బంగారపు దర్భముడి యుంగరమును తర్జని యందలి వెండి బటువులు రెండునుదప్ప శరీరమున నాభరణము లేవియులేవు; ఆయనపేరు రాజశేఖరు(డు; ఆయన ముఖ ప్రక్షాళన మగునప్పటికి గ్రామములోని గృహస్థులు నలువురును అక్కడకు వచ్చి, ఆయన వారి వారి తారతమ్యముల కర్హముగా( దగిన మర్యాదలు చేసి కూర్చుండు(డని చేయిచూప, 'చిత్తము' 'చిత్తము' 'మీరు దయచేయండి' అనుచు( జావడినిండ( గిటకిట లాడుచు( గూరుచుండిరి.

అప్పుడు రాజశేఖరు(డుగారు "సిద్ధాంతిగారూ! మీరు నాలుగు దినములనుండి బొత్తిగా దర్శన మిచ్చుట మానివేసినారు. మీ యింట( బిన్న పెద్ద లందఱును మతేమియు లేకుండ సుఖముగా నున్నారు గదా?"

సిద్ధాంతి:—"చిత్తం చిత్తము. తమ యనుగ్రహమువల్ల మే మందఱము సుఖముగానే యున్నాము. ఎన్ని కుటుంబములనైన నన్నవస్త్రాదు లిచ్చి కాపాడఁగల ప్రభురత్నములు తమరు గ్రామములో నుండఁగా మా వంటి వారి కేమి కొదువ? మా గ్రామము చేసికొన్న భాగ్యముచేతను, మా పురాకృత పుణ్యము చేతను, తమవంటి దాన కర్ణులు మా గ్రామమునకు విజయం చేసినారు గాని మఱియొకటి కాదు" అని రామశాస్త్రిగారి వంకఁ దిరిగి, "మనము వారి ముఖము ముందఱ స్తుతిచేయవలసినది కాదు గాని రాజశేఖరుఁడుగారు కేవలము నీశ్వరాంశ సంభూతులు సుండీ."

ఆ మాటల కాదరమును సూచించెడి మందహాసము చేసి రామశాస్త్రి "అందుకు సందేహమేమి? ఈ సంగతి మీరు నాతోఁ జెప్పవలెనా? వా రీ గ్రామమున నుండఁబట్టి మన మందఱము వారియండను నిలువఁగలిగినాముగాని, లేని యెడల నిండ్లును వాఁకిళ్ళును విడిచిపెట్టి మన మీపాటికి దేశములపాలయి లేచిపోవలసినవారము కామా? వారి తండ్రిగా రిక్కడకు వచ్చినప్పటినుండి యిది యొక గ్రామముగాఁ గనబడుచున్నదిగాని యింతకుఁ బూర్వము దీనికి నామరూపము లున్నవా?"

అని, మంచి సమయము తటస్థించినప్పుడు తన పాండిత్యమును దాఁచిపెట్టక, అందుకొని సిద్ధాంతిగారి స్తోత్రపాఠములకు సాయముగాఁ దనవి కూడ నాలుగు కలిపెను.

అప్పుడు రాజశేఖరుఁడుగారు మనసులో మిక్కిలి సంతోషించి నను పయి కాసంతోషము కానరాకుండ నఁడచికొని "సిద్ధాంతిగారూ! మొన్న మీ రెండవ చిన్నదాని కేమో గ్రహబాధ కనఁబడ్డట్టు విన్నాను. కొంచెము నిమ్మళముగా నున్నదా!"

అని యడిగినతోడనే సిద్ధాంతిగారు మోమున దీనభావము గానిపింపఁ గొంచెమాలోచించి తలయూఁచి "జోస్యుల కామావధానులగారి చేత విభూతి పెట్టించుచున్నాను.కాని దానివల్ల నిన్నటి కేమియు గుణమే కనఁబడలేదు. జాతకరీతిచే దాని కిప్పుడు శని చాలదు. ఎందుకైనను

మంచిదని నా తమ్మునిచేత నవగ్రహ జపము చేయించుచున్నాను. అంతతో నూరకుండక కామావధానులుగారినే 'పంచముఖి వీరహను మంతము పునశ్చరణ చేయవలసిన దనియు, జపశాంతి కేమయిన గావలసియున్న ఏ రాజశేఖరుడుగారినైన కాళ్లో కడుపో పట్టుకొని తెచ్చి నాలుగురూపాయల సొమ్మిచ్చుకోనైన నిచ్చుకొనియెద మంచి విభూతి పెట్టుమనియు ఆయన ననుసరించి బతిమాలుచున్నాను. అందు చేతనే యీ నాలుగు దినములనుండి దర్శనము చేయలేదుగాని లేక పోయిన నేది యెట్లయినను నేను తమ దర్శనము మానుదునా?"

రాజ.—"శాస్త్రిగారూ! మీరు రూపాయిల నిమిత్తము సంశయ పడ నక్కరలేదు. కావలసియున్న ఆ నాలుగురూపాయలను నే నిచ్చెదను. మఱి నాలుగురూపాయలు పోయినను మంచి వైద్యుని విచారింపవలెను. మన గ్రామములలో కామావధానులుగారికన్న—" అని మిన్ను వంకఁ చూచి యేమో యాలోచించుచుండెను. సిద్ధాంతి గారు చేసిన స్తుతి యమోఘముగాఁ బట్టుకొని కొంచెముగానో, గొప్పగానో ధనరూపమైన ప్రతిఫలమును దెచ్చుచునే వచ్చుచున్నది గాని యీవఱ కెన్నఁడును రాజశేఖరుఁడుగారి వద్ద వ్యర్థముగాఁ బోలేదు.

ధవళేశ్వరము నందును చుట్టుపట్టుల గ్రామములయందును వేఱు సిద్ధాంతి లేఁడు గనుక, ఆయన యింటికి వచ్చి వర్జ్యమెప్పు డని కాని, ప్రయాణముకు ముహూర్తము పెట్టుమని కాని, క్రొత్త బట్ట చించి కట్టుకొనుట కేదినము మంచిదని కాని, ఇల్లు కట్టుకొన నారంభించుట కేమాస మనుకూలమైనదని కాని, క్షౌరము చేయించుకొనుట కేవారము మంచిదని కాని, వివాహమునకు లగ్నము పెట్టుమని కాని, రజస్వల యయినప్పుడు నక్షత్రము చెప్పు మని కాని, సదా యెవ్వరో యొక రాయన నడిగి పోవుచునే యుందురు. దూరబంధువులు పోయినప్పుడు మైల యెంతకాలము పట్టవలెనో తెలిసికోవలె నన్నను, జబ్బు నక్షత్రమున నెవ్వరైన మృతినొంది నప్పుడు ఇల్లు వదలి యెంతకాలము లేచిపోవలెనో కనుఁగొనవలె

నన్నను. రోహిణ్యాది నక్షత్రముల యందు బిడ్డను గన్నప్పుడేమి శాంతి తగులునో యెఱుఁగవలెనన్నను. సిద్ధాంతి యొద్దకురాక సరి పడదు. ఏ కాపువాని పశువు తప్పిపోయినను, ఎవనింట ఏ వస్తువు పోయినను, వచ్చి సిద్ధాంతిగారి నడుగక పోరు. ఇటువంటి సమయము లయం దెల్లను, అతఁడు వీధి నడవలో నేలమీఁద ఇసుక పోసి దానిలో పూచికపుడకతో ఏమేమో బీజాక్షరములను అంకెలను వ్రాసి మీఁది వంకఁజూచి యాలోచించి వచ్చిన కార్య మిదియనియు, కార్య మీప్రకార ముగా నగుననియు చెప్పి పంపుచుండును. అతఁడు బల్లిపాటు మొద లైనవాని ఫలములను, శకునములు చూచి సంతానము కలుగు కాల మును కూడ చెప్పుచుండును. వేయేల? సిద్ధాంతి యాలోచన లేక యాచేరువ గ్రామములో ఏ శుభకార్యముకాని యశుభకార్యముకాని జరగదు. అతఁడు చెప్పెడి జ్యోతిషము తఱచుగా అబద్ధమే యగుచు వచ్చినను, అప్పుడప్పుడు కాకతాళీయముగా కొన్ని సంగతులు నిజ మగుటయుఁ గలదు గనుక జనులాతనిమాట యమోఘమని నమ్ము చునే యుండిరి.

అప్పు డా చావడిలో నున్న వారిలో నెవరో "బైరాగులు భూతవైద్యమునకు గట్టివా" రని మెల్లగా ననిరి. అంతలో రాజ శేఖరుఁడుగారు సిద్ధాంతిగారి వంకఁ జూపు త్రిప్పి "ఔను. బైరాగు లన్నతోడనే జ్ఞప్తికి వచ్చినది. పది దినముల క్రిందట ఈ గ్రామ మున కెవ్వఁడో యొక బైరాగి వచ్చినాఁడట! అతనికిఁ జూపింప రాదా? గోసాయీలకుఁ బరమహంస క్రియలును వనమూలికలును విశేషముగాఁ దెలిసి యుండును. వాండ్రెట్టి యసాధ్యమైన పీడల నైనను జిటికెలోఁ బోఁగొట్టుదురు" అనిన తోడనే చావడి యంతయు 'చిత్తము' 'వాస్తవము' 'అలాగున నవశ్యము చేయ వలసినదే' యను ధ్వనులతో నిండిపోయెను. మాటాడువారు ధన వంతులైనచో, వ్యర్థవచనము సహితము స్తుతియోగ్యము కాక పోదు సుండీ. ఆ మాటలవలన నుత్సాహము కలిగి, రాజశేఖరుఁ డుగా రాబైరాగిని తాము చూడక పోయినను బ్రహ్మ వర్చస్సు కల వాఁడని శ్లాఘించిరి.

అంత సిద్ధాంతి యుల్లములో లేని సంతోషమును మోమునఁ దెచ్చిపెట్టుకొని యొక్క చిఱునవ్వు నవ్వి, వినయముతోఁప చేతులు జోడించి రాజశేఖరుఁడుగారి ముఖమున దృష్టి నిలిపి, "తమమాట చేతనే మా చిన్నదాని బాధ నివారణమయినది. దాని యదృష్టము బాగుండ బట్టియే దేవరవారి ముఖమునుండి యీ మాట వచ్చినది. ఇప్పుడే తమ సెలవు ప్రకారము బైరాగి యొద్దకు వెళ్ళెదను" అని మనవిచేసి, ప్రయాణోన్ముఖుఁ డయి లేచి నిలువఁబడెను. రాజశేఖరుఁడుగారి యభిప్రాయము కొంచెము తెలిసినతోడనే బైరాగి మహానుభావుఁ డనువారును, మహామంత్రవేత్త యనువారును, వాయుభక్షణము చేయుననువారును, మందువేసవిని పంచాగ్ని మధ్యమునఁ దపస్సుచేయు ననువారును, అయి సభ యంతయు ఆతని విషయమైన స్తుతి పాఠములలో మునిఁగి పోయెను. ఒక్క గొప్పవాఁ డొకనిని మంచి వాఁడన్నచో, ఎవ్వని వాక్కు భిన్నముగా లేచును? ఎవ్వని నోరు స్తుతి వాక్యముల కొరకు తడువుకొనును?

అప్పుడు రాజశేఖరుఁడుగారు వీధి వంకఁ జూచి- "ఎవ్వరో స్త్రీలు నీళ్ళకువచ్చి మనలఁజూచి సిగ్గుపడి వెనుకకు నాలుగడుగులు పెట్టి నిలుచుండి యొండొరుల మొగముల వంకఁ జూచుకొను చున్నారు. మన మందఱమును లేచి బైరాగిని జూచి వత్తము రండి" అను మాట తోడనే ఎల్లరును లేచి ప్రయాణోన్ముఖు లయి నిలుచుండిరి. వెంటనే యందఱును గలిపి యుత్తర ముఖ ముగా రామపాదముల వైపునకు నడవ నారంభించిరి.

---

# రెండవ ప్రకరణము

రాజశేఖరుఁడుగారి కూఁతురు రుక్మిణి స్నానమునకు వచ్చుట—నదీతీరవర్ణనము—రుక్మిణికిని సిద్ధాంతిగారి భార్యకు జరిగిన సంభాషణ—నీళ్ళకు వచ్చిన యమ్మలక్కల ప్రసంగములు—పంచాంగపు బ్రాహ్మణుఁడు వచ్చి సంకల్పము చెప్పుట—రుక్మిణి స్నానము చేసి బయలు దేరుట.

రాజశేఖరుఁడుగారు పౌరబృందముతో నాలు గడుగులు ముందుకు సాగినతోడనే యొకసుందరి సుందరగమనముతో బాదములయందలి యందియలమ్రోఁత మట్టియలమ్రోఁతతోఁ జెలిమి సేయ, మొలనున్న వెండి యొడ్డాణము యొక్కయు, ముంజేతుల పసిడికంకణముల యొక్కయు, గాజుల యొక్కయు కాంతులు ప్రతిఫలించి కుడిచేతిలోని తళతళ లాడుచున్న రాగిచెంబునకుఁ జిత్రవర్ణ మొసంగ, మోమున లజ్జాభయములు నటియింప, పయ్యెద చక్కఁ జేర్చుకొనుచు తిన్నగాఁ దలవంచుకొని మెట్లు దిగివచ్చి చెంబును నీటి యొడ్డున నుంచి చెంబు మూతి కంటించియున్న పసుపుముద్దను దీసి కొంత రాచుకొని మోదుగాకులోఁ జుట్టి తెచ్చుకొన్న కుంకుమ పొట్లము నొక బట్టయుతుకుఁ రాతిపయిఁబెట్టి, మోఁకాలిబంటి నీటిలో నిలుచుండెను. ఆమె రాజశేఖరుఁడుగారి పెద్దకూఁతురగు రుక్మిణి- ఆహా! ఆమె సౌందర్యమును బ్రత్యక్షమునఁ జూడ నోచిన వారి కన్నులే కన్నులు. ఆకాలమున హిందూదేశమునందలి సుందరులలో నెల్లఁ దెనుఁగు దేశములోని వారే రూపరేఖా విలాసములచేత నసమానలుగా నుండిరి; వారిలోను బ్రాహ్మణజాతి నాతులు మిక్కిలి చక్కనివారు. కాని రుక్మిణి రూపమును దలఁచి నప్పుడు మాత్రము, ఆ సుందరు లొకసౌందర్యవతు లని చెప్పుట కెల్లవారును సంకోచ

పడుచుందురు. జనులందఱును మిక్కిలి సౌందర్యవతులని యొప్పు
కొన్నవారిలో చక్కనివారి నేటి యామె చెంత నిలిపినచో గురూపురాం
డ్రనిపించెడి యామె మనోజ్ఞత నేమని పిలువవలెనో తెలియకున్నది.
అపూర్వ వర్ణనాసామర్థ్యము గల కాళిదాసాది కవులలో నొకరినైనను
బోలఁ జాలని నేను, ఉన్నంత సౌందర్యమును బోధించుపదములు
లేనిభాషతోను, పదములు బోధించునంతవఱకైనఁ బూర్ణముగాఁ
దెలుపలేని బుద్ధితోను, వర్ణింపఁ బూనుట యామె చక్కదనము
యొక్క గౌరవమునకుఁ గొఱంత కలుగఁజేయుటయేగదా? అయినను
యోగ్యవస్తువు దొరికినపుడు వర్ణింపక మానుట యుచితము కాదు
కాఁబట్టి, యీ సృష్టిలోని వస్తువులతో వేనితోనైనను బోల్చి ఈ
పుస్తకముఁ జదువువారి కామె యవయవములయొక్క రూపము
వించుక మనస్సునఁ బుట్టింతునన్నను ఆమె యంగముల నెంచి యా
వస్తువుల పేరు చెప్పుటకె సిగ్గు వొడముచున్నది. వేయేల? చతు
ర్ముఖుఁడును ఘుణాక్షరన్యాయమునఁ బడిన యామె రూపమునకుఁ
దలయూఁచి,తన యపూర్వవస్తు నిర్మాణ చాతురిని మెచ్చుకోకపోఁడని
యామెం జూచినవా రెల్లరు నెంచుచుందురు. ఆమె శరీరచ్ఛాయం
జూచిన, ఇఁక నీభూమి మీఁద బంగారమున కేమి చాయ యెక్కువ
గలదని తోఁచును; నల్లగానుండు నేని, విండ్లామె కనుబొమలం
గొంచెము పోలియున్నవని చెప్పవచ్చును; నేత్రములను జూచిన
భాగ్యదేవత వానియందే కాపురము కుదిరినట్లు కనిపించును; కాని,
నిపుణముగాఁ బరిశీలించినచో నేదో స్థిరవిచార మొకటి యామె
హృదయపీఠమున నెలవుకొని యున్నట్లు ముఖలక్షణములు కొంచెము
సూచించుచున్నవి. ఆ విచారమునకుఁ గారణము లేకపోలేదు. ఆమె
పెనిమిటి సహవాసదోషముచేత నాలు నెలల క్రిందటఁ దలిదండ్రు
లతోఁ జెప్పక దేశాంతరము లేచిపోయినాఁడు.

ఇప్పు డామెకుఁ బదునాలుగు సంవత్సరముల వయస్సు
గలదు. బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లు,ఇప్పుడిప్పుడే యౌవనము
తలచూపి యాపె మేనిసోయగమునకు మెఱుఁగు దెచ్చుచున్నది.

పచ్చని దేహము మీఁద అప్పుడు కట్టుకొన్న తెల్లనిబట్టయు బంగార మునకు పటిక పూసినట్లు లోకవిధమయిన యందమునే కలిగించు చుండెను. సుందరాంగుల యంగముం జేరినప్పు దేది యందముగా నుండదు? ముక్కున నద్దబాసయు, చెవుల పీలాలబావిలీలును, చేతుల కంకణములును, మెడలో పట్టెడయును, మొలను వెండి యొడ్డాణ మును, కాళ్ళ నందెలును, మట్టెలును, ఆమె యప్పుడు ధరించు కొన్నది. కంకణములకు సాహాయ్యముగా రంగురంగుల గాజులును లక్కపట్టెలును ముంజేతుల నలంకరించుచుండెను. ఈ నగలచే నామె యవయవముల కేమైన శోభ కలిగినదో లేదో కాని యవయవములచే నగలు కొంత శోభగాంచుట మాత్రము కరతలామలకముగాఁ గనఁ బడుచున్నది.

సృష్టిలోని యే పదార్థమునకును బరిపూర్ణత్వమును దయ చేయనిరీతివే, సర్వసముఁడగు భగవంతుఁడు రుక్మిణి సౌందర్య మందును గొంతకొఱంతను గలిగించినాఁడు కాని బొత్తిగాఁ గలిగిం పక మానినవాఁడు కాఁడు. నిజముగా అది యొక కొఱంతయే యయ్యె నేని యామెకుం గల లోపమెల్లను మెడ మిక్కిలి పొడుగుగా నుండుట. అయినను ముష్టిసర్వశాస్త్రి యాయవారమునకు వచ్చినప్పు డెల్ల నామె మెడను జూచి సంతోషించి, "మిక్కిలి నిడుదగు మెడ కామిని- కులవర్ధని దాని నెఱిఁగికొండవిరి బుధుల్" అను సాముద్రిక గ్రంథములోని పద్యమును జదివి పోవుచుండును.

అప్పుడొక్క విధవ మొలలోఁతునీళ్ళలో దూరముగా నిలు చుండి నోటిలో నేమేమో జపించుకొనుచు నడుమనడుమ దలయెత్తి సూర్యునివంకఁ జూచి దండములు పెట్టుచు, దోసిటిలో నీళ్ళుపట్టి సూర్యున కర్ఘ్యము విడుచుచు, అప్పుడప్పుడు ప్రదక్షిణములు చేయు చుండెను. అవలకే వచ్చియున్న కొందఱు స్త్రీలు తమ యిత్తడి బిందెలను నీళ్ళలోఁబెట్టి రేవునకు సమీపముగా నున్న రాళ్ళపయిని గూర్చుండి యొక్కొక్కపెట్టు వేయుచు మధ్యమధ్య నొక్కొక్క మాట చెప్పుకొనుచు బట్టల నుతుకు కొనుచుండిరి; ఒక వృద్ధాంగన

సగముబట్ట కట్టుకొని తక్కిన సగము ముతుకుకొన్న తరువాత, ఉతికిన భాగమును మార్చికట్టుకొని మిగిలియున్న భాగము ముదుకుకొను చుండెను; కొందఱు వయసులోనున్న స్త్రీలను గోప్యముగా నుంచఁ దగిన తమ యవయవములు స్నానము చేయుచున్నట్టియు గట్టున నున్నట్టియు పురుషులకుఁ గనబడునట్లు సిగ్గు విడిచి తొడుగుకొన్న రవికలను దీసి యుదుకుటయి తాము కట్టుకొన్న వస్త్రముల నక్కడనే విప్పి యావలకుదికిన వేఱు తడిబట్టలను చుట్టఁబెట్టు కొనుచుండిరి. ఆవల పది బారల దూరమున దాసీ జనములు క్రిందఁపడిన మెతుకులకై కావు కావని మూఁగిన కాకులను చేయెత్తి యదలించుచు అంటుతప్పెలలను ఒడ్డునఁ బెట్టుకొని తోము కొనుచుండిరి. ఆ పయిని బెస్తలు పుట్టగోచులతో మొలబంటి నీటిలో నిలుచుండి వలత్రాడు మొలత్రాడునం దోపుకొని రెండు చేతుల తోను వలను త్రిప్పి లోఁతు నీళ్ళలో విసరివైచి మెల్లమెల్లగా లాగు చుండిరి. మఱికొందఱు లాగిన వలలను నీళ్ళలోఁ బలుమాఱు జాడించి యంటుకొనియున్న బురద పోయిన తరువాత గట్టునకుఁ దీసికొనివచ్చి చివరఁ దగిలించియున్న యినుపగుండ్లు గలగలలాడ వలలను విప్పి రాయి రప్ప క్రిందఁ బొఱవైచుచు సగుమనడుమ వల కన్నుల సందున నుండి మిట్టిమిట్టిపడు చిఱుచేపలను చేతులతో నదిమిపట్టి మీలపుట్టికలను చేతఁ బట్టుకొని నిలుచున్న పిన్నవాండ్ర చేతి కందించుచుండిరి. ఆపయిని నాలుగడుగులు నడచిన తరువాత దినమున కాఱణాలపాటు పడఁగలిగిన యొక సోమరిపోతు నీళ్ళలో నున్న నడదోనెమీఁది కెక్కి నల్ల యనఁబడు పేరిన నెత్తురుముద్దను త్రాటి చివరనున్న గాలమునకు గ్రుచ్చి, లేచి నిలువఁబడి కుడిచేతితో సత్తువకొలఁదిని త్రాడు గిరగిర త్రిప్పి లోతునీట విసరివైచి మరలఁ గూర్చుండి చేప యెప్పుడు చిక్కునాయని తదేకధ్యానముతో త్రాడు వంకనే చూచుచు త్రాడు కదిలినెప్పుడెల్ల నులికులికిపడుచు దైవవశ మున చేప గాలమును మ్రింగి కొట్టుకొనుచుండ మెల్లమెల్లగా లాగుచు, త్రాడు తెంపుకొని పాఱిపోవునో యను భయమునఁ గుడి

చేతిలోని త్రాడు వదలుచు మరల లాఁగి ఉండగాఁ జూట్టుచు. చేప కల సట వచ్చిన తరువాత నొడ్డునకు లాఁగి పెన్నిధిగన్న పేదవలెఁ బర మానందము నొందుచు. ఒడ్డుదాఁక వచ్చిన తరువాత గ్రహచారము చాలక మత్స్యము త్రాడు తెంపుకొని పఱచిన చేతిలోఁ బడ్డ సొమ్ము పోఁగొట్టుకున్న వానివలె నిర్వేదించు చేఁప రాకపోఁగా రెండణాల గాలముకూడఁ బోయెనని విచారించుచు వట్టిచేతులతో నింటికిఁ బోయెను. ఆ సమీపముననే యొడ్డునఁ జేరి కుఱ్ఱవాండ్రు వెదురుచువ్వ కొక్కుదారమును గట్టి దానికొననున్న చిన్న గాలమునకు ఎఱ్ఱలను గ్రుచ్చి నీళ్ళలో వైచుచుఁ దటాలునఁ దీయుచు జిన్నచేపలను బట్టు కొని మరియొక దారమునకు గుదిగ్రుచ్చి 'నాకు బదిజెల్లలు దొరికినవి' 'నాకు నాలుగు పరిగెలు దొరికిన'వని. యొండొరులతోఁ జెప్పుకొనుచు సంతోషించుచుండిరి. అక్కడి జువ్విచెట్టుమీఁదఁ గూర్చుండి చూచు చున్న చెరుగ్రద్దయొకటి యకస్మాత్తుగా వచ్చి యొకటి రెండు పర్యాయములు పిల్లవాండ్రు త్రాడునకు గ్రుచ్చుటకయి చేతం బట్టు కొన్న చేఁపఁ నెగరఁదన్నుకొని పోయెను.

అప్పు డొక్క పెద్దముత్తయిదువ మొగమంతయు నొక్కచే బొట్టుపెట్టుకొని. బట్టలతోనున్న బుజముమీఁది బిందెను తీసి చేతఁ బట్టుకొని రుక్మిణియున్న తావునకు వచ్చి గౌరవముతోఁప"అమ్మాయి గారూ! ఏమి. మీ రీ వేళ స్నానమునకు దయచేసినారు?"

రుక్మిణి—కార్తిక సోమవారము కాదా? కడపటి సోమ వారము గనుక ప్రదోషవేళ మా అమ్మతోకూడ శివాలయమునకు వెళ్ళ వలెనని గోదావరిస్నానము చేయ వచ్చినాను.

పెద్దముత్తైదువ—మీరు రాత్రిదాక భోజనము లేకుండ నుండఁగలరా!

రు—ఒక్కదినమున కేమి? ఏలాగునైన నుందును. మొన్న మీ రెండవ చిన్నదానికి శరీరములో నిమ్మళముగా లేదని చెప్పినావు. ఇప్పుడు కొంచెము నిమ్మళముగా నున్నదా?

పె—ఏమి నిమ్మళమో నాకు తెలియదు. మావారు రెణ్ణాళ్ళఁ

బట్టి కామావధానులచేత విభూతి పెట్టించుచున్నారు. రాత్రి తెల్లవారిన దాఁక నిద్రలేక బాధపడినాము.

రు.—గ్రహబాధ యేమి?

పె.—అవునమ్మాయి! ఏమి చెప్పుకోను? మగఁడు—అని 'యిక్కడ నెవరును లేరుగదా' యని నాలుగుప్రక్కలను జూచి మఱింత దగ్గఱగా జరిగి చెవిలో మెల్లగా "మగఁడు పట్టుకొని పీకు కొని తించున్నాఁడు. మీ రెఱుఁగుదురుగదా దానికి పెండ్లియయి మూడేండ్లు కాలేదు. అప్పుడే దాని మగఁడు పోయి యాఱునెల లయి నది. అప్పటినుండియు దానికి కొన్నాళ్ళు కలలోను, కొన్నాళ్ళు రాత్రి వేళ ఒంటరిగా నున్నప్పుడును కనబడుచునే యున్నాఁడు. పిల్లది సిగ్గు చేత ఎవ్వరితోను చెప్పక దాఁచినది. నెలదినములనుండి బొత్తిగా ఎప్పుడును విడువక రేయింబగళ్ళు వెంటవెంటనే యెక్కడికి వెళ్ళిన నక్కడికెల్లఁ దిరుగుచున్నాఁడు. ఏమి పాపమో కాని మూడు దిన ములనుండి మఱింత పీకుకొని తించున్నాడు. ఈ మూణ్ణాళ్ళలోను పిల్లది సగమయిపోయినది. ఇంతేగదా? మగనితో—"

అని కడుపులోనుండి దుఃఖము బయలుదేఱఁగాఁ గొంచె మాపుకొనుచుఁ గన్నీరు పైటచెఱఁగుతో తుడుచుకొనుచుఁ గొంచెము తాళి గద్గద స్వరముతో—"మగనితో సౌఖ్య మనుభవింపనా? కాపు రము చేయనా?" అని కొంచెము బిగ్గరగా నేడ్వఁజొచ్చెను.

రు.—(ఆ మాటలు మనసుకు నాఁటి యొడలు పులకరింపఁ గొంత తాళి ధైర్యము తెచ్చుకొని) పెద్దముత్తైదువవు. ఆలాగున గంట తడి పెట్టరాదు. ఊరుకో ఊరుకో. రోగము మనుష్యులకు రాక మ్రాకులకు వచ్చునా?

పె.—(ఏడుపు చాలించి) అమ్మాయీ! దాని కే సౌఖ్యము నక్కఱలేదు. ఈలాగునసైన నుండి బ్రతికి బట్ట కట్టినఁజాలును. మా ముసలిప్రాణములు రెండును బ్రతికి బాగున్నంతవఱకు దాని యన్న వస్త్రముల కేమియు లోపము రాదు.

రు.—(కొంచెముసేపేమో యాలోచించి) సోమిదేవమ్మా!

మీ వారు గ్రామములో పెద్దసిద్ధాంతులుగదా? తెలిసికూడ చిన్నదానిని అంత యర్థాయుష్మంతున—

పె—(మాట కడ్డము వచ్చి) ఔనౌను: నీ వడుగఁ బోవునది నేను గ్రహించినాను. ఎవరి యదృష్టమున కెవరు కర్తలు? దానికి ముండమోయవలసిన వ్రాఁతయుండఁగా నెవరు తప్పింపఁగలరు? ఎవ రైనా జాతకము మంచిదిగాఁ జూచి వివాహము జేయుదురుగాని పెండ్లికుమారునకు లేని యాయువును తెచ్చి వోయఁగలరా?

రు—అవును. జాతకములో మీ యల్లునకు పూర్ణాయుస్సే యున్నది కాఁబోలు?

పె—(కొంచె మనుమానించి) పూర్ణాయుస్సా!—అవును పూర్ణాయుస్సే యున్నది. జాతక ప్రకారము జరగదా అందు వేమో, వేళ తిన్నగా కట్టి జాతకము వ్రాసిన యెడల, అందులో నెన్ని యక్ష రము లున్నవో అన్నియక్షరములును జరుగును. శాస్త్రము చక్కఁగా తెలియనివారు తిన్నగా వేళ కట్టలేక పాడుచేయుదురు. మావారు ఇన్ని ముహూర్తములు పెట్టినారు కదా? నీ వెఱిఁగినంతవఱకు మఱియొక విధముగా నెక్కడనైన జరిగినదేమో చెప్పు.

రు—కన్నమ్మగారి బుచ్చమ్మ వివాహ ముహూర్తము మా చావడిలో మన సిద్ధాంతిగారే పెట్టినారుగాని దాని మగని జాతకము కూడ సిద్ధాంతిగారే వ్రాసి—

పె—అవును, ఒకానొకటి తప్పిపోవుటయుఁ గలదు. జ్యోతి షమునకుఁ బార్వతిశాప మున్నదఁట! మావా రెప్పుడును ఈ సంగతినే చెప్పుచుందురు. గట్టుమీఁద మట్టెల చప్పుడగుచున్నది. ఎవ్వరో వచ్చుచున్న ట్లున్నారు. ఈపాటి మన మీసంగతి చాలింతము-అని వెనుక తిరిగి చూచి బిందె యొడ్డుననుంచి స్నానమునకు నీళ్ళలో దిగుచున్నది.

ఇంతలోఁ గొందఱు పుణ్యస్త్రీలును విధవలును మెట్లు దిగుచు ముందున్నవారు వంగి కాళ్ళ పెండిపావడములను కొంచెము పయికిఁ దీసికొనుచు వెనుకఁ దిరిగి దూరమునను్నవారు వచ్చువఱకు దగ్గఱ

వారితో మాటలాడుచు మెల్లమెల్లగా నీటి సమీపమునకు వచ్చి గృహ కృత్యములను గుఱించి మాటాడుకొనుచు బిందెల నొద్దునఁ బెట్టిరి. అందఱును నొక్కచోట సమావేశమయి సావకాశముగా మాటాడు కొనుటకు నీళ్ళకు వచ్చినప్పటికన్న మంచి సమయము స్త్రీల కెప్పు డును దొరకదు గదా? అందుచేతనే వారు సాధారణముగా కొంచెము తీఱుబడిచేసుకొని మాటాడవలసిన నాలుగు మాటలను నీళ్ళకు వచ్చి నప్పుడే మాటాడుకొనిపోవుదురు. అప్పుడు ముప్పదియేండ్ల యీడు గల పొట్టి దొకతె ముందుకువచ్చి ముక్కుమీఁద వ్రేలు వైచికొని "ఓసీ! వెంకమ్మా! రాత్రి శేషమ్మను మగఁడు కొట్టినాఁడట! విన్నావా?"

వెంకమ్మ—దానిని మగఁ డెప్పుడును ఆలాగుననే కొట్టు చుండును. నెలదినముల క్రింద కఱ్ఱపుచ్చుకొని కొట్టినప్పుడు చేతి గాజులన్నియు పగిలిపోయినవి.

పొట్టి—దానిని మగఁడు తిన్నగా ఒల్లఁడఁట. అని బుగ్గను చేయిపెట్టుకొని "ఓసీ! ఓసీ! అతఁడు ముండ నుంచుకొన్నాఁడఁట సుమీ."

బట్టతల ముత్తైదువ యొకతె చేతులు త్రిప్పుకొనుచు ముందుకు వచ్చి "సరి సరి! దాని గుణము మాత్రము తిన్ననిదా? మొన్న సుబ్బావుధానుల కొడుకుతో మాటాడుచుండఁగా మగనికంటనే పడ్డ దఁట! మగవాఁ డేలాగున నున్నను దోషములేదు. ఆఁడుదాని గుణము తిన్నగా నుండనక్కఱలేదా?"

పొట్టి—దానికేమిగాని, పాపము! చిన్నమ్మను అత్తగారు లోకములో లేని కోడంట్రికము పెట్టుచున్నది. అంతేకాకుండ మగఁ డింటికి వచ్చునప్పటి కేవో నాలుగు లేనిపోని నేరములు కల్పించి చెప్పును దానిమీఁద అతఁడు ప్రతిదినమును దానిని చావఁగొట్టు చుండును.

పదియాఱు సంవత్సరముల వయస్సుగల యొక చామన చాయది కన్నుల నీరుపెట్టుకొనుచు—"అత్తగారు బ్రతికియున్న

చోట్లనెల్ల నిదేకర్మము. లోకములో అత్తలెల్ల ఒకసారి చచ్చిరా—"

పొట్టిది—శేషమ్మా! నీ అత్తగారుకూడ నిన్ను చాలా బాధ పెట్టునని విన్నాను. నిజమా?

శేష—బాధ గీధ నాకు తెలియదు. కోఁత పడలేక చచ్చి పోవుచున్నాను. జాము తెల్లవాఱ లేచి యింటి ప్రాచియంతయుఁజేసి, అంట్లు తోమి, యింటికి కావలసిన నీళ్ళన్నియు తోడి, మడిబట్టలుదికి. ఆమె లేచువఱకు పనులన్నియు జేయుదును. అప్పుడు నాలుగు గడి యల ప్రొద్దెక్కి లేచి కన్నులు నలుపుకొనుచు వచ్చి గరిటెనంటు వదలలే దని, వాకిటిలోఁ బెంట యట్టేయున్నదని తిట్ట మొదలు పెట్టును. తరువాత పేడచేసి గోడమీఁద పిడకలు చఱిచి తెక్కలు విఱుచుకొని జాము ప్రొద్దెక్కి చలిది భోజనమునకు వచ్చువఱకు, 'ఒకమూల తెల్లవాఱకమునుపే తిండికి సిద్ధపడుదువు. పనిమాత్రము ముట్టుకో'వని వంట చేసికొనుచు సాధించుచుండును. పగలు మగ నితో మాటాడితేఁ దప్పుగదా? రాత్రి యందఱి భోజనములు అయిన తరువాత అత్తగారికి కాళ్ళుపిసికి యామె నిద్రపోయిన తరువాత వెళ్ళి పడుకోఁబోవు నప్పటికి రాత్రి రెండు యామములగును. పడుకొన్నది మొదలుకొని యెప్పుడు తెల్లవాఱిపోవునో, వేళకుఁ బనిగాకున్న అత్తగా రెక్కడ కోపపడునో అని నిద్రలో సహిత ములికి పడు చుందును; ఎట్లు చేసినను నాకు తిట్లును దెబ్బలును తప్పవు గదా? అని మొగమునకు కొంగడ్డము పెట్టుకొని నేత్రముల నీరు కార్పఁ జొచ్చెను.

రుక్మి—అత్తగారికి కోపము తెప్పించకుండ జేసెడు పనిని నీవు తిన్నగానే చేయరాదా?

శేష—అయ్యో! రుక్మిణమ్మా! నీక త్తగారు లేదు గనుక నీ కీసంగతు లేమియుఁ దెలియవు. ఎంతపని చేసినను అత్తగారి కెప్పుడును మెప్పు లేదు. కలయంపి చల్లునప్పుడు చిక్కగాఁ జల్లిన. 'ఇల్లంతయు సముద్రము చేసినావు, జాఱిపడి చచ్చిపోనా?' యని తిట్టును. పలచగాఁ జల్లిన, 'నీళ్ళకు కఱవువచ్చినట్లు పేణ్నీళ్ళే చల్లి

నావుకా'వని తిట్టును. అడిగిన మాటకు మాఱు చెప్పిన 'నా మాట కెదురు చెప్పుచున్నావా' యని కోపి పెట్టును. బదులు చెప్పక యూర కున్న 'మొద్దులాగున మాటాడవే' మని తిట్టును. ఆమెముందఱ ఏమి చేసినను తప్పిదమే. 'ఆఁ' అన్న అపరాధము. 'నారాయణా' యన్న బూతుమాట. నేను కాపురమునకువచ్చిన నాలుగు సంవత్సరముల నుండియు వాడుకొనుచున్న ఓటికుండ నాలుగు దినముల క్రింద పగిలి పోయినప్పుడు రాయివంటి క్రొత్తకుండ పగులఁ గొట్టినా వని నేటి వరకు తిట్టుచున్నది.

పొట్టి—అత్త పోఁగొట్టినది అడుగోటికుండ. కోడలు పోఁగొట్టినది క్రొత్తకుండ యన్నసామెత వినలేదా?

శేష—నేను పడుబాధ యిప్పు దేమిచూచినారు; నా విధవ వదినెగారు బ్రతికియున్నప్పుడు చూడవలెను. నిరుడు అమ్మవారి జాడ్యములో—దైవము కడుపు చల్లగా—ఆబిడ పోయినప్పటినుండి మూఁడు పూఁటలును కడుపున కింత తిన్నగా అన్నము నైన దిను చున్నాను. ఆఁడబిడ్డ జీవించియున్నప్పు డదియునులేదు. ఉన్న మాట చెప్పవలెను. ఎన్ని యన్నను ఇప్పుడు నా అత్తగారు అన్నము తిన్నగా తినవైతివని తిట్టునుగాని తిని పోతినని తిట్టదు.

పొట్టిది—లోకములో నెటువంటివారును లేకున్న- పిండి బొమ్మను జేసి పీఁటమీఁదఁబెట్టిన, ఆడుబిడ్డతనమున కదిరదరిపడ్డది- అన్నసామెత యూరకే పుట్టినదా?

ఇంతలో జపము చేసికొనుచున్న ముసలామె కొంతదూరము వచ్చి చెంబులోని నీళ్ళు పాఱఁబోసి "మీకు మాటల సందడిలో కన్నులు కనఁబడునా? ఈవల స్నానముచేసిన వారున్నారని యయిన లేదు. ఊరకే నీళ్ళు విదలుపుకొందురు. మీఁద మయిలనీళ్ళు పడి స్నానము చేసినముండను చచ్చినట్టు చలిలో మరల మునుఁగు చున్నాను" అని గొణుఁగుకొనుచు లోతు నీళ్ళలోనికి నడిచి బుడుగు బుడుగున నాలుగు మునకలువేసి బయలుదేఱి, మాటాడుకొనుచున్న వారివంక కన్ను లెఱ్ఱచేసి చూచుచు "అమ్మలక్కలు క్రిందును

మీఁదను దెలియక పొంగిపడుదురు. మా కాలములో నున్న కోడం త్రికములో ఇప్పుడు సహస్రాంశము లేదు. అత్తమంచియు, వేము తీపును లేదు. ఎక్కడను అత్తలేని కోడ లుత్తమురాలు, కోడలులేని యత్త గుణవంతురాలు" అని సణుగుకొనుచు, దోసిలితో నదిలోని నీళ్ళు మూడుసారులు గట్టునపోసి, కొంచెము దూరము పోయిన తరువాత మరల మూఁడుమాఱులాత్మ ప్రదక్షిణములుచేసి మెట్లెక్కి యదృశ్యురా లయ్యెను.

శేషమ్మ—(నాలుగువంకలుఁ జూచి వడవడ వడఁకుచు) అమ్మలారా! నేనీలాగున అన్నానని మీ రెవ్వరితోనైన ననెదరు సుండీ! మా అత్తగారు విన్న నన్ను చంపివేసిపోవును. ఈవరకే నాకు గతులు లేకుండ నున్నవి. ఇది విన్న బొత్తిగానే యుండవు. వెంకమ్మ తల్లీ! ఈ బ్రతుకు బ్రతుకుటకంటె గోదావరిలో పడితే బాగుండునని తోఁచుచున్నది—అని వలవల నేడ్వఁజొచ్చెను.

వెంకమ్మ—ఊరుకో! ఊరుకో! అటువంటి అవాచ్యము లెప్పుడును పలుకరాదు. పద్దవాండ్రెప్పుడును చెడ్డవాండ్రుకారు-అని యూరడించుచున్నది.

శేషమ్మ—(ఆ మాటలతో దుఃఖము మాని) గోదావరికి వచ్చి ఛాలాసే పయినదమ్మా! ఇంతసే పేమిచేయుచున్నావని అత్తగారు చంపివేయును. వేగిరము పోవలెను—అని వేగముగా నీళ్ళుముంచుకొని బిందె బుజముమీఁద నెత్తుకొని గట్టునకు నడుచుచున్నది.

అప్పుడే నీళ్ళకు వచ్చిన వారిలో ఇరువదియేండ్ల ప్రాయముగల యొకతె చేరువనున్న మఱియొకతె మెడదగ్గఱకు చేయి పోనిచ్చి, "కాంతమ్మా! ఈ పట్టెడ క్రొత్తగా చేయించుకొన్నావా? నీకేమి? నీవు అదృష్టవంతురాలవు. కనుక తల మొదలుకొని పాదముల వఱకు నీ మగఁడు నీకు నగలు దిగవేయుచున్నాఁడు."

కాంత—విన్ననే కంసాలి సుబ్బయ్యచేసి తెచ్చినాఁడు. నాలుగు పేటల పలకసరులు కూడ చేయుచున్నాఁడు. పేరమ్మా! నీ మగనికి నీమీఁద బహుదయ అని విన్నాను. నిజమేకదా!

పేర—ఎందుకు వచ్చిన దయ? సంవత్సరమున కొక్క పర్యాయమయినను పట్టుమని పదివరహాల నగచేయించి పెట్టుట లేదు గదా? పూర్వజన్మమునందు చేసికొన్న పాపముచేత నా కీజన్మ మందు ఇటువంటి—

అప్పుడు ప్రక్కనునిలుచున్న మఱియొకతె—పేరమ్మా! నీవు వృథాగా లేనిపోని వ్యసనము తెచ్చిపెట్టుకొనుచున్నావు. నీ కేమ యిన అన్నమునకు తక్కువయినదా? బట్టకు తక్కువయినదా? మహారాజు వలె మగఁడు తిన్నగా చూచునప్పుడు నగలు లేకపోయిన నేమి? మగనికి ప్రేమ లేకపోయినతరువాత దిక్కుమాలిన నగ లెందుకు, వట్టి మోతచేటు. చూడు మన గ్రామములో బంగా రమ్మకు శరీరమునిండ నెన్నినగ లున్నవో! ఆ నగలపేర్లే కొన్ని నేను వినలేదు. దీపములు పెట్టఁగానే వెళ్ళి దాని మగఁడు భోగము దాని యింటిలోఁ గూరుచుండును. దాని కేమిసుఖ మున్నది? నీ మగఁడెప్పుడును చీఁకటి పడ్డ తరువాత వీధి గుమ్మము దాఁటఁడు.

పేర—నీవు చదువుకొన్న దానవు గనుక, కావలసినన్ని శ్రీరంగనీతులు చెప్పఁగలవు. నీకువలె మాకెవ్వరికిని ఇటువంటి వేదాంతము తెలియదు. నలుగురును నగలు పెట్టుకొని వచ్చినప్పుడు, వట్టి మోడులాగున ఎక్కడ కయినను పేరంటమునకు వెళ్ళుటకు నాకు సిగ్గగు చున్నది. జానకమ్మా! నీకు నా మగనివంటి బీద వాఁడు—

జాన—పేరమ్మతల్లీ! నే నేమో తెలియక అన్నాను. కోప పడకు—అని బిందె ముంచుకొని వెళ్ళిపోవుచున్నది.

తక్కినవా రందఱును నీళ్ళు ముంచుకొని వెనుకనే బయలు దేఱి. "ఓసీ పూజారి పాపమ్మ చెంపకొప్పు పెట్టుచున్నది"- "కరణము పెండ్లా మెంత యొయ్యారముగా నడుచునో చూచినావా"- "అయ్యగారి రామమ్మ కేమిగర్వమో కాని మనుష్యులతో మాటాడనే మాటాడదే"-"పుల్లమ్మ పట్టపగలే మగనితో మాటాడునఁట!"- "కన్నమ్మది కొంచెము మెల్లకన్ను సుమీ"- "కరణముగారి సీత

మ్మకు నగలే లేవే" అని పరులమీఁది దోషముల నెన్నుకొనుచు మెట్లెక్కి యిండ్లకు నడచిరి. విద్యాగంధమే యెఱుఁగని మూఢ వనితలకు మాటాడుకొనుట కంతకన్న మంచి విషయము లేమి దొరకును? అక్కడకు వచ్చెడి స్త్రీలు సాధారణముగా సంభాషించెడి యితర విషయములు సవతుల పోట్లాటలును, మాఱుతల్లుల దుర్మార్గములును, మగల యనాదరణమును మొదలైనవి తప్ప మఱి యేమియు నుండవు.

అప్పుడు కుడిచేతిలో తాటాకులమీఁద వ్రాసిన పంచాంగమును బట్టుకొని, నీర్కావి ధోవతి కట్టుకొని, మడతపెట్టిన చిన్నయంగ వస్త్ర మొకటి బుజముమీఁద వేసికొని, మొగమునను దేహమునను విభూతి పెండెకట్లు స్పష్టముగా గానుపింప, నిమ్మకాయ లంతలేసి రుద్రాక్షలుగల కంఠమాల ప్రకాశింప, రాండిని బెట్టుకొన్న పొడుము కాయ చిన్నకంఠివలెఁ గనఁబడ, గట్టుమీఁదినుండి పోవుచు గోదావరిలో స్నానము చేయువారెవ్వరో యని కనులకు చేయి యడ్డము పెట్టుకొని నిదానించి చూచి, గిరుక్కున మళ్లి యొక బ్రాహ్మణుఁడు మెట్లు దిగి వచ్చెను.

బ్రాహ్మణుఁడు:—రుక్మిణమ్మగారూ! సంకల్పము చెప్పెదను స్నానము చేయండి.

రుక్మి:—నేను డబ్బు తీసికొని రాలేదే.

బ్రా:—డబ్బుకేమి? మధ్యాహ్న మింటివద్ద నిత్తురుగాని లెండి (అని వంగి నిలుచుండి) ఆచమనము చేయండి. కేశవా-నారాయణా-మాధవా-గోవిందా-తూర్పు మొగముగా తిరుగండి, సూర్యునికేసి.

రుక్మి:—స్నానము చేయవలెనా?

బ్రా:—సంకల్పము చెప్పనిండి- అని పొడుము బుఱ్ఱను రాండి నుండి తీసి, మూఁతతీసి రెండు మాఱులు నేలమీఁద మెల్లగాఁ గొట్టి యెడమచేతిలో కొంత పొడుము వేసికొని మరల నెప్పటియట్ల మూఁతవేసి కాయను రాండిని ధోవతిలో దోపుకొని యెడమ చేతిలో నున్న పొడుమును బొటనవ్రేలితోను, చూపుడు వ్రేలితోను పట్ట

గలిగినంత పెద్దపట్టును పట్టి బుఙ్జున పీల్చి రెండుముక్కు లలోను ఎక్కించి, మిగిలిన దానిని రెండవపట్టు పట్టి చేతిలో నుంచుకొని, ఎడమచేతిని కట్టుకున్న బట్టకు రాచి ముక్కు నలుపుకొని, 'శుభే శోభన ముహూర్తే-శ్రీ మహావిష్ణురాజ్ఞేయ - ప్రవర్తమానస్య-ఆద్య బ్రహ్మణ- ద్వితీయ ప్రహరార్థే- శ్వేతవరాహకల్పే - వైవస్వతమన్వంతరే- కలియుగే- ప్రథమపాదే- జంబూద్వీపే- భరతవర్షే- భరతఖండే- అస్మిన్ - వర్తమానే - వ్యావహారిక చాంద్ర మానేన - కాళయుక్తి నామసంవత్సరే - దక్షిణాయనే - శరదృతౌ- కార్తికమాసే- కృష్ణపక్షే- ద్వాదశ్యాం-ఇందువాసరే-శుభనక్షత్ర - శుభయోగ - శుభకరణాద్యనేక గుణ విశిష్టాయా - మాస్యాం - శుభతిథౌ - క్షేమస్థైర్య విజయాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం - అఖండ గౌతమీస్నాన మహం కరిష్యే—మూడు మాఱులు స్నానము చేయండి.

రుక్మిణి తఱుచుగా స్నానము చేయునది కాదుగాన లోతునీళ్ళ లోనికి వెళ్ళుటకు భయపడి, మునుఁగుటకు చేతఁగాక మోకాలిలోఁతు నీళ్ళలోఁ గూర్చుండి కొప్పువిప్పుకొని దోసిలితో తలమీఁద నీళ్ళుపోసి కొనుచుండెను. అప్పుడు సంకల్పము చెప్పిన బ్రాహ్మణుఁడు డబ్బు నిమిత్తము తరువాత వచ్చెదనని చెప్పి వెడలిపోయెను. అంతట రుక్మిణి బట్టకొంగుతో తలతుడుచుకొని,శిరోజములు చివర ముడివైచి కొని గట్టువంకఁ జూచి దూరమునుండి వచ్చుచున్న తండ్రిగారిని జూచి వేగిరము వేగిరము బయలుదేఱి, రాతిమీఁద బెట్టిన కుంకుమ పొట్లమును దీసి నొసట బొట్టుపెట్టుకొని, రెండుమాఱులు చేతితో నీళ్ళు చెంబుమీఁద పోసి తీసికొని, రెండడుగులు నదిలోనికిఁ బోయి నీళ్ళు ముంచుకొని, బట్ట తిన్నగా సవరించుకొని, ఉతికిన బట్టలు బుజము మీఁదను వానిపయిని నీళ్ళతో నున్న బిందెయును పెట్టుకొని తనకొఱకయి కనిపెట్టుకొని యున్న సిద్ధాంతిగారి భార్యతోఁ గూడ గృహమునకుఁ బోవ బయలుదేఱెను.

———

## మూడవ ప్రకరణము

రుక్మిణి యింటికిఁ బోవుట—గృహవర్ణనము—రాజశేఖరుఁడుగారు వచ్చి కచేరిచావడిలోఁ గూర్చుండుట—బంధుదర్శనము—స్వహస్త పాకియైన వైశ్వదేవపరుఁడు.

సిద్ధాంతిగారి భార్యయు రుక్మిణియు బయలుదేఱి సోపానము లెక్కి వీధిపొడుగునను దేవాలయముదాఁక తిన్నగా నడిచి, అక్కడ నుండి కుడిచేతివంక నున్న వీధిలోనికి మళ్ళి కొంతదూరము పోయిన తరువాత, రుక్మిణి తూర్పు వైపు సందులోనికి రెండడుగులు పెట్టి నిలుచుండి వెనుక తిరిగి రెండుమాఱులు మెల్లగా దగ్గెను. ఆ దగ్గుతో సిద్ధాంతిగారి భార్యకూడ నిలుచుండి 'అమ్మాయీ! నేనుందునా?' అని వెనుక తిరిగి పలికెను.

రుక్మి—మంచిది. సోమిదేవమ్మగారూ! నాకొఱకయి మీరు చుట్టు తిరిగి యింటికి వెళ్ళవలసి వచ్చినదిగదా?

సోమి—ఎంత చుట్టు? నిమిషములో వెళ్ళెదను.

రుక్మి—పోయిరండి.

సోమి—వీదవాంద్రము, మా మీఁద దయ యుంచవలెను జుండీ.

రుక్మి—దానికేమి? వెళ్ళి రండి. అని నాలుగడుగులు నడచి మరల వెనుక తిరిగి "సోమిదేవమ్మగారూ! చెప్ప మఱచిపోయినాను. సాయంకాలము దేవాలయములోనికి వెళ్ళునప్పుడు మీరొక్క పర్యాయము వచ్చెదరు కాదా?"

సోమి—అవశ్యము. అలాగుననే వచ్చెదను. నేను పోయి వస్తునా?

అని సోమిదేవమ్మ నడచినది. సిద్ధాంతిగారు గాని, ఆయన

పెద్దలుగాని యెప్పుడును యజ్ఞము చేసినవారు కాకపోయినను, సోమి దేవమ్మ పుట్టినింటివంక వారిలో మాత్రము యజ్ఞము చేసినవారు బొత్తిగా లేకపోలేదు. సాక్షాత్తుగా ఆమె పితామహుండే యజ్ఞముచేసి యేండేంట నొక్కొక్కటి చొప్పున మూడుపదుల మీంద నాలుగు శ్రావణపశువులను బట్టి మఱి రంభాదులతో స్వర్గసుఖ మనుభవింపం బోయెను. సోమిదేవమ్మ తండ్రి యజ్ఞము చేయకపోయినను, తండ్రి యెంతో ధనవ్యయము చేసి సంపాదించుకొన్న పేళ్లను మాత్రము పోంగొట్ట నిష్టములేనివాం డయి తన కుమారునకు సోమయాజులనియు, కుమార్తెకు సోమిదేవమ్మ యనియు నామకరణములు చేసెను.

రుక్మిణియు సందులో మూఱు బారలు నడచి, అక్కడ నుండి దక్షిణముగా తిరిగి, ఆ సందులో రెండు గుమ్మములు దాంటి పెరటి దారిని మూడవయిల్లు ప్రవేశించెను.

రాజశేఖరుండుగారి యిల్లు ఆకాలపుటిండ్లలో మిక్కిలి సుందర మైనది. వీధిగుమ్మమునకు రెండు ప్రక్కలను రెండు గొప్ప అరుగులు కలవు. ఆ రెండు అరుగులకును మధ్యను పల్లముగా లోపలికిం బోవు నడవ యున్నది. ఆ నడవ మొగమున సింహద్వార మున్నది. ద్వారబంధపు పట్టెలకు గడపదాపున ఏనుంగుతలమీదం సింహము గూర్చుండి కుంభ స్థలములను బద్దలు చేయుచున్నట్లు చిత్రముగా చెక్కంబడి యున్నది. ఇరుప్రక్కలనుండు నాసింహములయొక్క శిరో భాగములు మొదలుకొని గొడుగుబల్లవఱకును పువ్వులను కాయలును గల లత చెక్కంబడి యున్నది. ఈ కమ్ములకు పయిగా రెండు ప్రక్కలను కఱ్ఱ గుఱ్ఱములు వీధివైపునకు ముందఱికాళ్లు చాచి చూచు వారిమీంద దుముకవచ్చునట్లుగాం గానిపించును. ఈ గుఱ్ఱముల కాళ్ళకే శుభదినములందు మామిడాకుల తోరణములు గట్టుచుందురు. గుఱ్ఱ ముల రెంటికిని నడుమ నుండు గొడుగుబల్లమీంద నడుమను పద్మ మును, పద్మముల కిరు పార్శ్వములను గుఱ్ఱములవఱకు చిత్రము లయిన యాకులును, పువ్వులునుగల తీంగెయును చెక్కంబడి యున్నవి. ఆ తీంగపైని కాళ్ళు మోపి ఫలములను ముక్కుతో

పొడుచుచున్నట్టు నడుమనడుమ చిలుకలు చిత్రింపబడి యున్నవి. వీధి తలుపులకు బలమయిన గ్రంధులు చేయఁబడి వాని పయిని సహిత మొకవిధమైన పుష్పలత మలఁచఁబడి యున్నది.

గుమ్మము దాటి లోపలికి వెళ్ళినతోడనే చావడి యుండెను. ఆ చావడి కెదురుగా పెద్ద కుండు ఒకటి యుండెను. వర్షము కురియు నప్పుడు నాలుగు వైపులనుండియు చూరునీళ్ళు కుండులోఁబడి వీధి చావడి క్రింద నుండు తూముగుండ వీధిలోనికిఁ బోవును. ఆ కుండు కు త్తరపువైపునను దక్షిణపువైపునను ఒకదానికొకటి యెదురుగా రెండు చావళ్ళుండును. అందు దక్షిణపుది కచేరిచావడి. దానిలో వివాహాదుల యందు తాంబూలములకు పిలిచిన బంధువులును పెద్దమనుష్యులును సభ చేసి గూర్చుండఁగా, క్రింద బోగము మేళము జరుగుచుండును. ఇతర సమయములలో పెద్దమనుష్యులు చూడవచ్చినప్పుడును, మధ్యాహ్నభోజన మయిన తరువాత పురాణ కాలక్షేపము జరుగునప్పు డును, శిష్యు లప్పుడప్పుడు చదువుకో వచ్చినప్పుడును రాజశేఖరుఁ డుగా రందు కూర్చుందురు. ఆ చావడికి రెండుప్రక్కలను రెండు గదులు గలవు. ఆ చావడి దక్షిణపువైపు గోడకు పొడుగునను తెక్కల తలుపు లుండి, తీసినప్పు డెల్లను సభవారి చెమటలార్ప మలయ మారుతమును లోపలికిఁ బంపుచుండును. ఆ తలుపులకు వెనుక పంచ పాళియు, దాని వెనుక పలువిధములయిన పూలమొక్కలతో నేత్రము లకు విందుగొలుపు చిన్న దొడ్డి యుండెను. ఆ చావిడిలో మూడు గోడలకును నిలువెడెత్తునకు పయిని మేకులకు గొప్ప పటములు వేయఁబడియున్నవి. అందు దశావతారములు మాత్రమే కాక, కృష్ణుడు గోపికల వలువలు నెత్తికొనివచ్చి పొన్నచెట్టుమీఁదఁ గూర్చుండి వారిచేఁ జేతులెత్తి మ్రొక్కించుకొనుచున్నట్టును, వెన్నలు దొంగిలినందుకయి తల్లి రోటను గట్టిపెట్ట దాని నీడ్చుకొనిపోయి మద్దులఁ గూల్చద్రోచినట్టును, మరియు ననేకవిధముల కృష్ణలీలలు గల పటములును, కుమారస్వామి తారకాసురుని జంపుచున్నట్టును, పార్వతి మహిషాసురుని వధించుచున్నట్టును, శివుఁడు త్రిపురసంహా

